శ్రీరస్తు.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

# శ్రీ వెలుంగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రభూపాల

విరచితంబైన

# నిర్గుణవాదనిరాకరణము.

అనుతత్త్వగ్రంథము.

చెదలవాడ, సుందరరామశాస్త్రులవారి

శారదాంబా విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడెను.

౧౮౮౯ సం॥

తొండయార్పేట

చెన్నపురి.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

## నిర్గుణవాదనిరాకరణము.

### భూమిక.

నేను వ్రాసిన మనస్సాక్ష్యము అను తత్త్వ గ్రంథములో "సర్వశక్తులు గల జగత్కారణమైన దైవము కలదు" అనుసారాంశ మేర్పడినందు వలన స్వభావ వాదులైన నాస్తికమతస్థుల మతములు ఖండింప వలసిన యావశ్యక మేర్పడి "నాస్తిక ధ్వాంతభాస్కరము" అనుగ్రంథమును రచించినాఁడను.

ఇపుడు "బ్రహ్మము కలదు అయితే అదినిర్గుణము" అని చెప్పెడు మతములలో నుండు విరోధములు దెలుపుచు "జ్ఞానేచ్ఛా క్రియాది సర్వశక్తులు గలవాఁడు బ్రహ్మము" అని వ్రాయ వలసినయగత్యము గలిగి "నిర్గుణవాద నిరాకరణము" అను నీ గ్రంథము. శ్రీ, వెలుగోటి బంగారు యాచేంద్ర భూపాల కుమారుండను సర్వజ్ఞకుమార యాచేంద్రాభిధానుండను నగు నేను వ్రాయఁబూని కొన్నవాఁడను.

### మంగళశ్లోకము.

నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోస్తుతే సర్వత ఏవ సర్వ ।
అనంత వీర్యామిత విక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోసి సర్వః ॥
అని భగవద్గీతలలోనిది. ఇందుకు అర్థము. ఓ శ్రీకృష్ణా ముందరనున్న వెనుక నున్న సర్వదిక్కుల యందును నీకు నమస్కారము. అమితసామర్థ్యము పరాక్రమము గల నీవు, సమస్తమును లెస్సగా వ్యాపించి యున్నావు. అందువలన సర్వస్వరూపుఁడవైతివి. అనిభావము. ఇట్లు సర్వశక్తిస్వరూపుఁడు సర్వవ్యాప్తుఁడు గానుండు జగత్కారణ బ్రహ్మ

మనుగొందఱుమతస్థులు నిర్గుణ మని చెప్పుచున్నారు. ప్రపంచములో నింతకన్న అర్థము లేనిమాట మఱియొకటి కనుపడదు.

ఏలనంటే గుణములు లేని బ్రహ్మము గుణములతో జేరిన ప్రపంచమునకు గారణ మెట్లగును.

అయితే, శుక్తిరజత భ్రాంతివలె బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదాన కారణమని వారుచెప్పుచున్నారు. అప్పటికి బ్రహ్మమునకు భ్రమ యొప్పవలెను. భ్రమయొప్పితే గుణము గలిగెను.

కొందఱు, ఘటమునకు కులాలునివలె ప్రపంచమునకు బ్రహ్మము నిమిత్తకారణమునియందురు. ఆపక్షములో నుపాదాన కారణమయిన ప్రధానము అను వస్త్వంతరమును ఒప్పవలెను. అప్పటికి ద్వైతము వచ్చును, కాబట్టి ప్రపంచమునకు బ్రహ్మము పరిణామ్యుపాదాన కారణ మనియే చెప్పవలయును. ఇందుకు భాగవతము, ౨ స్కం, ౫అ, ౧౩, శ్లో ॥ ద్రవ్యంకర్మచ కాలశ్చ స్వభావోజీవఏవచ । వాసుదేవాత్పరో బ్రహ్మన్ నచాన్యోర్థోస్తి తత్వతః ॥ అనియున్నది. మఱియు విష్ణుపురాణము ౫ అం, ౧౮ అ, ౪౯ శ్లో ॥ భూతాత్మా చేంద్రియాత్మాచ ప్రధానాత్మా తథాభవాన్ । ఆత్మాచపరమాత్మాచ త్వమేకః పంచధాస్థితః ॥ అనియున్నది. ఇందువలన సర్వము బ్రహ్మపరిణామ మనియే చెప్పవలయును.

కావున గుణములతో జేరిన ప్రపంచమునకు గుణములతో జేరిన బ్రహ్మమే కారణము కావలయును.

అయితే, నిర్గుణమనగా నేవిధమయిన గుణములులేనిది. ఇట్లేల నిర్గుణవాదులు చెప్పుచున్నారంటే, బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేని దనియుండు, వారిసిద్ధాంతమును బట్టి జగత్సృష్టిపాలనాదులకు హేతువులయిన సర్వశక్తి సంకల్ప క్రియా దయాదిగుణములుకూడ, లేవని చెప్పుచున్నారు, సజాతీయ భేదమనగా

బ్రహ్మమునకు సమానజాతిద్మైన చిత్తులు. విజాతీయ భేదమనగా బ్రహ్మ మునకన్న భిన్నజాతిమైనయచిత్తు. స్వగత భేదమనగా బ్రహ్మమునందు న్న సంకల్పాది గుణములు.

ఇట్టివి, బ్రహ్మమునకు లేవని చెప్పుచున్నారు.

అట్టివియుంటే భేదమును ఒప్పవలసి వచ్చుచున్నదని గుణసామా న్యాభావము బ్రహ్మమని చెప్పుచున్నారు.

ఇట్టి నిగుణబ్రహ్మము జగత్కారణ మెట్లగును. మఱియు నిట్టి పదార్థము లేనిదనియే చెప్ప వచ్చును.

ఏపదార్థంబును గుణవిశిష్టము గానిది లేదు. ఏపదార్థంబును గుణాశ్రయముగా నుండునేగాని గుణాశ్రయముగాక యేదియు నుండ జాలదు. ఎట్లనగా పృథివ్యప్తేజోవాయ్వాకాశములు గంధ శైత్యదాహ కత్వ స్పర్శ శబ్దాది గుణములు క్రమముగా లేక యుండవు. జీవేశ్వరు లన్నచో కించిద్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వాది గుణవిశిష్టులనియే వారు చెప్పుచు న్నారు.

పరబ్రహ్మ మన్నచో సంకల్ప పూర్వక జగత్సృష్ట్యాది గుణము లు లేకయే, జగత్కారణ మెట్లగును. అయితే బ్రహ్మమునకు స్వసంక ల్పము వలన జగత్సృష్ట్యాదులు గలుగలేదు. మాయా విద్యోపాధుల చేత నవచ్ఛిన్నుడై యీశ్వరత్వ జీవత్వాదులు గలిగి నియామకనియా మ్యాదిభావములు గలుగుచున్నవని చెప్పుచున్నారు.

సజాతీయ విజాతీయ స్వగత భేదములు బ్రహ్మమునకు లేవని చెప్పుచును, బైనజెప్పిన విజాతీయ భేదోపాధుల వలన బ్రహ్మమునకు నీశ్వరత్వ జీవత్వాదులు గలుగుచున్న వనుట, ఇది యెట్టి విరోధమో చూడుడు. అట్లయితే బ్రహ్మము సర్వోపాధి వినిర్ముక్తుడని వారు చె ప్పెడుదానికి భంగము గలుగును.

అయితే యాబ్రహ్మమునకు బైనజెప్పిన యుపాధులు వాస్తవ

ములు గావనియు రజ్జు సర్పభ్రాంతివలె అధ్యారోపితములనియు, నిం దువలన బ్రహ్మము ప్రపంచమునకువివర్తోపాదాన కారణ మనియు జె ప్పుచున్నారు.

ఆ పక్షములో భ్రమించువాడు, భ్రమాధార రజ్జువు, పూర్వము చూడబడిన సర్పము, భ్రమ జనక దోషము, ఇన్నిలేక భ్రమ గలుగదు. జగద్భ్రమ స్థలములలో గూడ, నిట్టిసామగ్రి యుండవలెను. ఇన్నియు న్నంటే, విజాతీయభేదములు గలిగి ద్వైతము సిద్ధించును.

మఱియు బ్రహ్మమునందు బ్రహ్మమునకే భ్రమ గలిగినదంటే, అ వ్యక్తమై నిగుణమైన బ్రహ్మమునకు తనయందేతనకు భ్రమయెట్లు గలు గును.

మఱియు ముందు ఉపాధి గలిగి అందు వలన వెనుకభ్రమ గ లిగినదంటే, ఉపాధియను ద్వితీయపదార్థమునొప్పవలయును. లేక భ్రమగలుగుటయే యుపాధియని యంటే, సత్యజ్ఞానానంద స్వరూప మని వారిచే జెప్పంబడు బ్రహ్మమునకు భ్రమ యెట్లు గలిగె.

అయితే భ్రమ, మాయ వలన గలుగుచున్నది. మాయ మిథ్యా భూతంబుగాన, ద్వైతము రానేరదని చెప్పుచున్నారు.

మిథ్యయనగా నసత్యమనియు, నందువలన మాయాకార్యమ యిన జగత్తు అసత్యమనియు వారే చెప్పుచున్నారు. ఇందు వలననే "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనివారిసిద్ధాంతము. బ్రహ్మము సత్యమగు టచేత త్రైకాలికాబాధ్యత్వము చెప్పవలసినది. మాయావిద్యాదుల స త్యములగుటచేత త్రైకాలికబాధ్యత్వము ఒప్పవలసి యున్నది. ఇట్టి సత్యప్రతిబంధియై వంధ్యాపుత్ర తుల్యమయిన మాయ, యెప్పుడును లే నిదే ఆయెనే, దీనివలన త్రికాలములయందు ఏకముగాను నిగుణము గాను నిర్విశేషము గాను నిర్వికారము గాను నద్వితీయముగాను నుం డు సత్పదార్థమునకు, ఉపాధియెట్లు గలిగె - ఇది యిట్లుండనిండు.

భూమయనునది బ్రహ్మగుణమా, లేక మనోగుణమా, బ్రహ్మగుణమంటే, బ్రహ్మము సగుణమగును, మనోగుణమంటే, మనస్సు ఇరువత్తాలలో జేరిన ప్రకృతియొక్క భేదముగాన, నట్టి మనస్సుకు భూమగలిగితే, నిగుణమయిన యాత్మకు నీశ్వరత్వ జీవత్వాది బంధము లెట్లుగలిగె నని యడిగితే, ఉపాధిప్రయుక్తమయిన యీయవచ్ఛిన్న వాదము మీద నిట్టి యాక్షేపములు గలుగు ననికొందఱు ప్రతిబింబ వాదము చేయుచున్నారు.

ఎట్లనగా అంతఃకరణమందు బ్రతిబింబించు బ్రహ్మప్రతిబింబమే, జీవుడనియు సుఖదుఃఖాది భోక్తృతయుజన్మాంతరంబులును, నాప్రతిబింబమునకె యనియు, బ్రహ్మాద్వితీయ జ్ఞానముచేత నంతఃకరణ నాశము గలుగుటే మోక్షమనియు జెప్పుచున్నారు.

ఇదిచూడగా, పులివాత తప్పించుకొనబోయి సింహము వాత బడెనన్న సామెతగా నున్నది యెట్లనగా:

అంతఃకరణ ప్రతిబింబమే జీవుడని చెప్పితే, అవిద్యా స్వరూపమయిన అంతఃకరణ మెక్కడిది. అంతః కరణముంటే ద్వితీయవస్తువే ర్పడును. అది అవస్తువని యంటే లేని వస్తువునందు రూపములేని బ్రహ్మము ఎట్లు ప్రతిబింబించె - మంచిది ప్రతిబింబమునకు చైతన్యము లేదే సుఖదుఃఖాదుల నెట్లనుభవించును - ప్రతిబింబము బ్రహ్మముకాదు గదా ? ఈయచేతన ప్రతిబింబమునకు బ్రహ్మాద్వితీయ జ్ఞానము గలుగుట యెట్లు.

ఇట్లు గలిగితే "బ్రహ్మభూయాయకల్పతే" అనుగీతావచన ప్రకారము ప్రతిబింబమూ బ్రహ్మమయ్యేది.

లేదు ప్రతిబింబ హేతువయిన బ్రహ్మమునకు మోక్షము గలుగుచున్నదని చెప్పితే, చేయువాడొకడు, దానిఫలము ననుభవించువాడు మఱియొకడు, అను సామెతయగును.

మంచిది - అద్దములో గాని, జలములో గాని, సూర్యుడు బింబిం
చితే, ఉపాధిచలనము వలన దోచు ప్రతిబింబచలనాదులు సూర్యునికి
కలుగవలెను.

అట్లు గలుగునా ? కలిగినట్లు మనకు జలమునందుండు ప్రతి
బింబమును జూచువారికిగదా ? జలము గదలుటవలన సూర్యుడు కదలి
నట్లు కనుపడుట. ఇక్కడికి మూడు పదార్థములుండవలసి వచ్చెను.
అప్పటికి ద్వైతముగారాదా ? మంచిది జీవరూప ప్రతిబింబమునకు గలు
గు బ్రహ్మాద్వితీయ జ్ఞానము చేత ప్రతిబింబాధారమయిన యంతఃకరణ
ము నశించితే ప్రతిబింబము పోవును. అప్పటికి దనకు స్వల్పసుఖభో
క్తృతకు ఆధారమయినయంతఃకరణమును బోగొట్టుకొని తన్ను న
శింపజేసికొన్నట్టగును.

కావున నట్టి మోక్షము బుద్ధిమంతుడు పగవానికిగూడ రావలె
నని కోరడు. బ్రహ్మప్రతిబింబము జీవుడుగాని యెడల, నేతినేతీతి వా
క్యముల చేత నతన్నిరసన పూర్వక స్వస్వరూప జ్ఞానము గలిగి జీవ
బ్రహ్మైక్యము, అను మోక్షము గలుగుచున్నదని వారే చెప్పుటయెట్లు.

ఏపక్షము నందైనను ముందు బ్రహ్మమునకు బంధమునొప్పుకొ
న్నట్లాయెను. అందువలన దుఃఖాదిగుణములు గలిగె.

ఇట్లుండగా బ్రహ్మము నిర్గుణ మనుట యెట్లు. పైగుణములు
బ్రహ్మమునకు గలుగవంటారా ? మోక్షమనునది యేమిటిది. మంచిది.
పైన జెప్పిన బ్రహ్మాద్వితీయజ్ఞానముకూడ మనస్సుకే గదా గలుగును. మ
నస్సుకు గలుగు జ్ఞానమువలన నిర్లిప్తుడు నిర్గుణుడు అద్వితీయుడునై
న ఆత్మకు మోక్షము సిద్ధించుట యెట్లు. "మనఏవ మనుష్యాణాం కార
ణంబంధమోక్షయోః" అని వారే చెప్పుచున్నారు. ఆత్మనిర్గుణమాయె
ను. విజాతీయ భేదము, స్వగత భేదము లేనివాడుగా నుండుటవలన ఆ
యనకుమనస్సు యెక్కడిది. ఆమనస్సుకుగలుగు అజ్ఞానజ్ఞానముల వలన

ఆత్మకు బంధమోక్షము లెట్లుగలుగును.

ఈయాక్షేప పరిహారమునకు స్వప్నములో శిరశ్ఛేదన దృష్టాంతమును జెప్పుచున్నారు- స్వప్నము మనస్సుచేత ననుభవింప బడునదే ఆయెను. జాగ్రత్తయు మనస్సుచేత అనుభవింప బడునదియే ఆయెను. ఈ దృష్టాంతముచేత దనవిగాని శిరశ్ఛేదనాదులను దనవని తానను భవించినట్లు ఆత్మ, తనకులేని బంధమును తనకు గలిగినట్లు అనుకొనుటకు నెట్లు సరిపడును.

మంచిది. బంధమోక్షములు గలుగుటకై ఆత్మకు, మనస్సు కరణమంటారా? ఆత్మ నిర్గుణ మెట్లగును? అంతేకాక బ్రహ్మమునకు విజాతీయ భేదమును గలుగును. శుక్లయజుస్సు వాజసనేయ బ్రాహ్మణములో "ఆనందమేమనస్సని" చెప్పబడి పిమ్మట "మనస్సేబ్రహ్మమని" చెప్పబడియుండుట వలన, మనస్సు విజాతీయముగాదు. బ్రహ్మస్వరూపమే, యంటారా? గీతలలో "మనష్షష్ఠాణీంద్రియాణి" అనియింద్రియములలో జేర్చియున్నందునను, గౌడపాదాచార్యులవారు మాండూక్యోపనిషత్తుకు జేసిన కారికలో చిత్తైకాగ్ర్యజన్యానందము బ్రహ్మము గాదని చెప్పబడియుండుట వల్లనున్ను, మనస్సు గాని మనోజన్యానందముగాని, బ్రహ్మస్వరూపమని చెప్పగూడదు.

అట్లు చెప్పిన యెడల విష్ణుపురాణములో॥ శ్లో ॥ వస్త్వేకమేవదుఃఖాయ సుఖాయేర్ష్యోద్భవాయచ । కోపాయచ యతస్తస్మా ద్వస్తువస్త్వాత్మకం కుతః ॥ తదేవ ప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే । తదేవకోపాయుచ పునః ప్రసాదాయచజాయతే॥ తస్మాద్దుఃఖాత్మకం నాస్తి నచ కించిత్సుఖాత్మకం । మనసః పరిణామోయం సుఖదుఃఖాది లక్షణః॥" అనియున్నది. ఇట్లు మనస్సు యొక్క పరిణామము వలన సుఖదుఃఖాదులు గలుగు చున్నవని చెప్పబడియున్నందున, మనస్సు బ్రహ్మమైతే, మనః పరిణామములయిన సుఖ

దుఃఖములు, బ్రహ్మమునకు గుణములు కావలసివచ్చును.

మఱియు "మనఏవమనుష్యాణాం కారణంబంధమోక్షయోః" అని నిర్గుణవాదులు చెప్పుచున్నారు. కావున బంధమోక్షముల కు సుఖదుఃఖాదులకు మనస్సు హేతువుగా జెప్పినప్పుడు, మనస్సు ఆత్మకు స్వరూపమని చెప్పగూడదు.

కాబట్టి అట్టి మనస్సువలన గలుగు భ్రమజనిత దుఃఖసుఖాది భోక్తృత బ్రహ్మమునకు గలుగుట వలన, బ్రహ్మము సగుణం బయ్యె, అప్పటికి బ్రహ్మము నిర్గుణ మనుటయెట్లు?

వారు చెప్పెడు దృష్టాంత దార్ష్టాంతముల చేతను, యుక్తుల చేతను, బ్రహ్మము నిర్గుణం బనుట మాకు దెలియరాలేదు.

దీనికి పరిహారముగా బ్రహ్మము లక్ష్యార్థము చేతనే సిద్ధించునుగాని వాచ్యార్థము చేత సిద్ధింపదనివారు చెప్పుచున్నారు.

ఏపదము గాని వాచ్యార్థమును బొత్తిగా విడిచి కేవల లక్ష్యార్థమును నెచ్చటను బోధింపజాలదు. అట్లుబోధించునెడల వాచ్యార్థమును గలిపి యేలచెప్ప వలయును. ఇందుకు నిదే నిదర్శనము.

బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపమని వారే చెప్పుచున్నారు. ఇందువలననే బ్రహ్మము గుణవిశిష్టమని యేర్పడుచున్నది.

ఎట్లనగా, సత్యమనగా త్రికాలములలోబాధితముకానిది. అట్టి త్రికాలాబాధ్యతగలది. జ్ఞానమనగా, తెలివి, అట్టితెలివిగలది, ఆనందమనగా సుఖము. అట్టిసుఖము గలది, అనిచెప్పవలయును. ఇందులో బ్రహ్మమునకు ముఖ్యలక్షణము. జడవ్యావృత్తి నిమిత్తము జ్ఞానస్వరూప మనియును జెప్పుచున్నారు.

జ్ఞానమనగా తెలివి. ఇది జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు మూడు లేక, యేర్పడదు, ఎట్లన, జ్ఞాత = తెలిసికొనువాడు. జ్ఞానము =

తెలివి. జ్ఞేయము - తెలియదగినపదార్థము. ఇవ్వన్నియులేక, జ్ఞాన మనునది సిద్ధింపదు.

ఇందువలన బ్రహ్మము జ్ఞానస్వరూపమనుటలోనే మూడుపదార్థములుండవలసినట్టు లేర్పడుచున్నది గావున జ్ఞానమనునదియు బ్రహ్మమునకు గుణముగానే యేర్పడుచున్నది.

మరియు జహదజహల్లక్షణచేత జీవేశ్వరైక్యమును - ఇట్లు చెప్పుచున్నారు.

ఎట్లనగా, "సోయం దేవదత్తః" అనువాక్యములో "సః" అను పదము, తద్దేశ తత్కాలవృత్తిత్వ విశిష్ట దేవదత్తునిం దెలియ జేయుచున్నది. "అయం" అనుపదము, ఏతద్దేశ - ఏతత్కాలవృత్తిత్వ విశిష్టుడయిన దేవదత్తుని దెలియ జేయుచున్నది. దేవదత్తుడొక్కడయినను తద్దేశ, తత్కాలవృత్తిత్వ విశిష్టుడై యుండు నపుడు ఏతద్దేశ ఏతత్కాల వృత్తిత్వ విశిష్టుడై యుండుట బాధిత మగుచున్నది గనుక, అభేదాన్వయము సంభవింపదను హేతువుచే, తద్దేశ తత్కాలవృత్తిత్వములను, ఏతద్దేశ ఏతత్కాల వృత్తిత్వములను, వదలి తదిదం పదములు జహదజహల్లక్షణచే దేవదత్తుని మాత్రము తెలియజేయుట వలన అభేదబోధను ఉపపన్న మగుచున్న దని చెప్పురీతిగా, జీవేశ్వర పదములు జీవత్వేశ్వరత్వ విశిష్టులకు అభేదము బాధితమగుటచే కించిద్జ్ఞత్వ అల్పశక్తత్వ సర్వజ్ఞత్వ సర్వశక్తత్వ రూప జీవత్వేశ్వరత్వము లనెడు విశేషణములను వదలితే యీ జీవేశ్వర పదములు పైజెప్పిన లక్షణచేత శేషించిన చైతన్యమును మాత్రమే బోధించు చున్నవి గనుక జీవేశ్వరులకు అభేదము ఉపపన్న మగుచున్నది. అని వారుచెప్పుచున్నారు.

ఇట్లు ఉభయోపాధులను పైదృష్టాంతప్రకారము తోసివేయుట మనముగా నున్నది. లేక, వారే తోసి వేసికోనవలెనాక అక్క-

డికి విశేషణ విశిష్టుడయి బ్రహ్మము ఆయాకాలముల యందైనా గుణ
విశిష్టు డగుచున్నాడా? ఆపక్షములో బ్రహ్మము నిర్విశేష మని వారు
చెప్పెడు దానికి భంగము గలుగుచున్నది.

మఱియు వీరికి గలిగిన యుపాధులు స్వేచ్ఛాకృతములా?
లేక కర్మకృతములా? స్వేచ్ఛాకృతములంటే ఇచ్ఛఅనుగుణము గలిగి
నందున బ్రహ్మము సగుణంబయ్యె. కర్మకృతమంటే, ఉపాధికిపూ
ర్వము వారలకు కర్మ మెక్కడిది.

మంచిది "ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైత వాసనా"
అని వారు చెప్పెడు ప్రకారము - ఈశ్వరానుగ్రహము వలన పురు
షునికి అద్వైత వాసన గలిగి అవిద్యోపాధి నివర్తింప వచ్చును గా
ని, యీశ్వరునికి గలుగు మాయోపాధి యెట్లు యెవరి వలన నివ
ర్తించు నంటే, శుద్ధబ్రహ్మానుగ్రహము వలన నివర్తించు ననవలెను.
ఆపక్షమునందు శుద్ధ బ్రహ్మమునకు అనుగ్రహాది గుణములు కలుగవ
లసి వచ్చును.

అట్లు ఉభయులకు గల యుపాధులు నివర్తించితే గదా ఘ
ట తటాకోదకములు ఏకమైనట్లు జీవేశ్వరైక్యము గలిగి బ్రహ్మ మగు
నుగాని, ఒకరికి నివర్తించి యొకరికి నివర్తింపక పోయినా, ఉభ
యులకు ఐక్యము గలిగి బ్రహ్మము కాజాలరుగదా?

లేక జీవునికి యీశ్వర ప్రాప్తిమాత్రము గలుగు చున్నదంటే
ఉపాధి నివర్తించిన జీవాంశము నిరుపాధిక బ్రహ్మమునందు గలియ
వచ్చునుగాని సోపాధికమయిన యీశ్వరాంశమునం దెట్లుగలియును.

మఱియు విజాతీయ భేదమైన ప్రపంచము పూర్వము భ్రమ
చేతనే గలిగినదంటే, ఇపుడు జ్ఞానము వలన నివర్తించుటచేత స్వ
గతమైన అజ్ఞాన జ్ఞానాదులను ఒప్పవలసి యున్నది.

ఇందు వలన సజాతీయ విజాతీయ స్వగత భేద రహితనిర్గుణ

బ్రహ్మము జగత్తుకు కారణము గాజాలదు.

ఇకనైతే అట్టిబ్రహ్మము శూన్యము అను లోకోక్తిని అనుస రించిన మాటమాత్రముగా నుండవలెను. ఇదియర్థము లేని మాట. యిట్టిది యుండి ప్రయోజనమేమి, ఇట్టి నిగుణ బ్రహ్మమున్నాడని చెప్పుకొనుచును, నింత బకబంధప్రయాస యుక్తులు కల్పించి శాస్త్ర ములలో నేల వ్రాసిరో తెలియదు.

ఇంతేగాక, యిట్టివి గురువులకు దెలియుటగాని, శిష్యులకు దెలియు టగాని లేదు. సూక్ష్మబుద్ధిగల శిష్యులు పైసందేహముల నడిగితే గురు వులు సమ్మతి చెప్పలేక ఇవివాదమువలనసిద్ధాంతములుకాజాలవనియు, ననుభవైక వేద్యమనియు నిందువల్ల చిత్తైకాగ్రత సమాధులను జేసి చూ డుడనిసమాధులనుచెప్పుచున్నారు.అందులో చిత్తైకాగ్రతవలన నిద్రా ప్రారంభ సుఖమువంటి యొకసుఖము గలుగుచున్నది. అదియె స్వస్వ రూపజ్ఞాన మనియు స్వరూపానంద మనియు అప్పుడుప్రపంచజ్ఞానము లేదు గనుక జగత్తు మిథ్యయనియు, నిందు వలన సజాతీయ విజా తీయ స్వగతభేదములు అప్పుడు దోచవు గనుక బ్రహ్మమునకు నట్టి భేదములు లేవనియు చెప్పుచున్నారు.

ఇది అంతకంటె మిగుల పిచ్చి సంగతి. చిత్తైకాగ్రత వలన గలుగు ఆనందము బ్రహ్మమెట్లగునని అడిగితే - యిది నిర్విషయానం దమగుటచేత బ్రహ్మస్వరూపమని చెప్పుచున్నారు. నిద్రా ప్రారంభా నందము మాదక వస్తుసేవానందము నివియు నిర్విషయానందములేనే. యిట్టివి బ్రహ్మానందములు కావలసి వచ్చును. ఇందువలననే గౌడపా దాచార్యులవారు చిత్తైకాగ్ర్యజన్యానందము బ్రహ్మము గాదని చెప్పి యున్నారు.

మఱియొక చిత్రము కలదు. ఎట్లనగా, జీవుడు సమాధిలో బ్ర

క్షామయిన వెనుక ప్రపంచజ్ఞానము గలుగ వచ్చునా? అట్లు గలిగితే మోక్షము గలిగి తిరుగా బంధము కలుగు నట్లాయెను - అట్లు తిరుగా ప్రపంచ జ్ఞానమ్ము గలుగదంటే అట్టి సమాధియందు బ్రహ్మము ననుభవించి బోధించు గురువు లెట్లు గలుగుదు రని యడిగితే యప్రామాణ్యములయిన వేదములు ఈ సమాధులను బోధించుచున్న వని చెప్పుచున్నారు. ఇట్టి నిర్గుణ బ్రహ్మస్వరూపమును శబ్దరూపమయిన వేదమెట్లు బోధించును. ఇందుకు శ్లోకము॥ "అవిద్యద్విషయా వేదా నవిద్యా ద్విషయాః క్వచిత్। ఆ వాత్మత్వాచ్చ యద్వాచ్యో వాచ్యార్థస్య మృషాత్వతః॥" అనియిట్లు వారి గ్రంథములలోనే, వాగ్రూపమయిన శబ్దము దబ్బరమైనప్పుడు ఆశబ్దార్థమును దబ్బరే, అని యుండుటను బట్టి వేదబోధ్యమైన బ్రహ్మంబును నబద్ధమే కావలసి వచ్చును.

ఇందువలననే శంకరాచార్యులవారు, శారీరక మీమాంస భాష్యములో ౧ అధ్యాయము ౧ పాదములో ఆరంభణాధికరణములో ఆరవ అధికరణమందు వేదములు మిథ్యయని వ్రాసిరి. ఇందు వలన మిథ్యమైన వేదములు సత్యమయిన బ్రహ్మము నెట్లు ప్రతిపాదించును. అందు వలన అనుభవ ప్రతిపాద్యమైన బ్రహ్మమును సమాధియం దనుభవించిన గురువే బోధింపవలెను. అప్పటికి మోక్షమునకు పునరావృత్తి గలిగె.

ఆనందము ననుభవించుట యనగా ననుభవరీతిగ మనస్సే యనుభవింప వలసినది - అక్కడికి బ్రహ్మ మవాఙ్మానస గోచర మని వారు చెప్పేమ దానికి విరోధము గలిగె.

కావున నాయానందము ఆయాతరుణములందు చిత్తైకాగ్రతవలన గలుగు మనోజన్య సుఖమే యగును. అది మనస్సుతో ననుభవింపబడునదియే యగును. అట్లుగాకపోతే సమాధిచాలించిన వెనుక మనస్సునం దాసుఖమెట్లు ప్రతిభాసించును.

శిష్యునికి నుపదేశించుటకు గాని గ్రంథములలో వ్రాయుటకు

గాని యెట్లు సాధ్యపడును.

మంచిది క్లోరోఫారము సమాధియందుండు వానికి సక్రమముగాచూపితే కూచుండ లేక మనస్సుకు సుషుప్తి గలిగి వాడు క్రింద పడుచున్నాడు - అందు వలన పై సమాధులలో మనస్సున్నదని చెప్ప వలయును.

మఱియు క్లోరోఫారము మూచూచిన వానికి తన యవయవ ఖండనము జేసినను దెలియదే, అట్టివానికైన అంతటితో బ్రపంచము తే నట్టా? అప్పుడు ఇతరుల దృష్టికిగూడ లేకపోయెనా? క్లోరోఫారము వల్ల గలిగిన మైకము నివర్తించి తిరుగా ప్రపంచమును వాడనుభవింప లేదా? మఱియు జగత్తు మిథ్య, స్వప్నము వంటిదని చెప్పుటయెట్లు?

ఈసర్గుణాద్వైతము, ఉపదేష్టలను ఉపదేశ్య జనులను, వంచించునదియే గాని, గురువునకు శిష్యునకు ధీగోచరము గానిది - కావున నింత విచిత్రమయిన సిద్ధాంతముగలమతము బుద్ధిమంతుల బుద్ధికి యుక్తికి, అనుభవమునకు రానేరదు.

ఈమతమును మొదట నేర్పఱచిన వారికిని దానిని నమ్మెడు వారికిని గలిగిన యవివేక ధైర్య సాహసములకు నేనాశ్చర్య పడుచున్నాను.

ఏలనంటే ప్రతిసంగతిలోను బ్రతిక్షణమునందును మనయనుభవరీతిగ సర్వ శక్తిగల్ల దేవుడే జగత్కారణ మని బుద్ధిమంతులకు దోచుచున్నది.

ఇందుకు మనస్మార్త్యములో ॥ శ్లో ॥ కార్యత్వతశ్చిదచిదాత్మక విశ్వమేతత్ కర్త్రావినా నహి భవే త్పురుష ప్రయత్నాత్ । స్నంచ కార్య మిహ దృష్ట మతోభ్యుపేయో దాతాఫలస్య భవి తత్తదదృష్టయోగాత్ ॥ ఏవం విశ్వస్య కర్తారం దాతారంచ ఫలస్యచ।

త్వాం ప్రమాణేన విజ్ఞాయ సర్వథా శరణం గతః ॥ అనియున్నది బ్ర
హ్మము సర్వశక్తులు గలవాడని సర్వజనానుభవములో నుండుటయే
గాక,

వాసుదేవనామమునకర్థము.

మఱియు, భగవన్నామములలో ప్రసిద్ధమైన వాసుదేవ నామ
ము వ్యుత్పత్తి వలన దేవుడు సర్వశక్తిగలవాడని యుద్ఘోషించుచున్నది.
ఎట్లనగా విష్ణుసహస్రనామ భాష్యములోను నితరస్థలములందును నుం
డునవి వ్రాయుచున్నాను.

వసతి, వాసయతి, అచ్ఛాదయతీతివాస్వయమితి, వాసుః-

వాసుపదమునకు అర్థము.

| | |
|---|---|
| వసతి= | సమస్తము నందుండువాడు. |
| వాసయతి= | సమస్తమును దనయందుంచుకొనువాడు |
| అచ్ఛాదయతీతివా స్వయమితి | తానుగానే సర్వము నాచ్ఛాదించి యుండు వాడు |

దేవపదమునకు అర్థము.

దివ్ అను ధాతువు మీద కృత్ప్రత్యయము గలిగి సుబంతమై దేవశ
బ్దమేర్పడుచున్నది - దేవశబ్దము మీద అణ్ ప్రత్యయముగలిగి దైవశ
బ్దమేర్పడుచున్నది. దివ్ ధాతువునకు క్రీడాదులర్థము గనుక దేవ
దైవశబ్దములకు నొక్కటే యర్థము.

దీవ్యతీతి=దేవః, దీవ్యతి అనుదానికి,

| | |
|---|---|
| ౧, క్రీడతి= | సృష్ట్యాదికార్యములచే క్రీడించువాడు, యోగుల హృదయమందు క్రీడించువాడు. |
| | ఇందు వలన జగత్కర్తృత్వము, సర్వశక్తత్వము యోగిజనజ్ఞేయత్వము, భావార్థము వలన నేర్పడుచున్నది. |

౨, విజిగీషతే= దేవాదులనతిశయించువాడు
ఇందువలన సర్వకారణకారణత్వము మహా
దేవత్వము

౩, వ్యవహారతి= సర్వభూతములయందు వ్యవహరించువాడు.
ఇందువలన సర్వ వ్యాపకత్వము సర్వాంత
ర్యామిత్వము సర్వజ్ఞత్వము సర్వనియామక
త్వము.

౪, ద్యోతతే= తనంతనే ప్రకాశించువాడు.
ఇందువలనమరియొకరి చేత ప్రకాశించువాడు
గాడు స్వయంప్రకాశుడు కర్మకృత పూ
ర్వానుభవముగలవాడు గాడు పరాధీనుడు
గాడు.

౫, స్తూయతే= స్తుతింపబడువాడు.
ఇందువలన సర్వశక్తులు గలిగి నిరంకుశుడై
జగన్నాథుడగుటచేత నందఱిచేత స్తోత్రము
చేయదగినవాడు

౬, కామ్యతే= భక్తులచేత గోరబడువాడు.
ఇందువలన సర్వవిధఫల ప్రదాత గావున
సర్వాభీష్టములకై కోరబడువాడు.

౭, సర్వంవ్యాప్నోతి= అంతటవ్యాపించువాడు.
ఇందువలన పరిపూర్ణుడు

౮, మోదతే= భక్తజనుల యల్పసేవాదులచేతనే సంతోష
పడువాడు
ఇందువలన ననన్య గతిక దృఢవిశ్వాసముతో

తనశక్త్యనుసారముగ జేయుపరోపకారము చేత సంతోషించువాడు.

౯, మాద్యతి- దుర్జనుల గర్వింపజేయువాడు.
ఇందువలన తనయందు విముఖులు గానుండు వారిని మదింపజేసి పాపారంభకపాపముల ను జేయించువాడు.

౧౦, రోచతే- సర్వమును బ్రకాశింపజేయువాడు,
ఇందువలన తనసత్తా చేతనే అన్నియుప్రకాశింపజేయువాడు. అనగా దేహమునుఆత్మ, ప్రకాశింపజేయునట్లు ఆత్మను పరమాత్మరూపము చేత ప్రకాశింపజేయువాడు.

౧౧, గచ్ఛతి-గమయతి- నడుచువాడు, నడపించువాడు.
ఇందు వలన సర్వభూత సంచారిత్వము సూర్యచంద్ర సముద్ర కాల ఋతు ధర్మములు తప్పక నడిపించుచు అదృష్టానుసారముగ ప్రేరేపించు సర్వేశ్వరత్వము

౧౨, స్వపితి- నిద్రపోవుచుండువాడు.
ఇందువలన సర్వమును నిర్మించి వాట్లవాట్ల యందు దత్తత్స్వభావములను గల్పించివాట్ల వాట్ల వలన బ్రపంచకార్యములు నడుచునట్లు చేసి తాను సుఖముగా నిద్రించునట్లుండువాడు

౧౩, ముముక్షుభిర్గమ్యతే- మోక్షేచ్ఛగలవారిచేతపొందబడువాడు.
ఇందువలన మోక్షానందస్వరూపుడు. ముముక్షువులకు ప్రాప్యస్థానము.
అనిభావార్థములచేత నేర్పడుచున్నది.

వాసుదేవనామ నిర్వచనశ్లోకములు.

వాసుశ్చాసౌదేవశ్చ= వాసుదేవః

అనునీకర్మధారయ సమాసముచేత

వాసుః=దేవః

అనునీ రెండుపదములను జేర్చితే

వాసుదేవః

అనియగుచున్నది. దీనికి అర్థము.

శ్రీమహాభారతము - ఉద్యోగపర్వము.

౧, శ్లో॥ ఛాదయామి బృహద్విశ్వం భూత్వాసూర్య ఇవాంశుభిః। స
ర్వభూతాధివాసశ్చ వాసుదేవ స్తత స్మృతః॥

౨, శ్లో॥ వసనాత్సర్వభూతానాం వసుత్వా దేవయోనిషు । వాసు
దేవ స్తతో జ్ఞేయో యోగిభి స్తత్వ దర్శిభిః॥

వీనికిఅర్థము.

౧, సూర్యుడు కిరణములచేత వలె విభూతిచేత నేను సర్వ
మును ఆచ్ఛాదించు చున్నాను.

మఱియు సర్వభూతములయందునుంటున్నాను.

ఈకారణముల వలన వాసుదేవుడని చెప్పబడుచున్నాను.

౨, సర్వభూతములకు నివాస స్థానమైనందునను, సర్వభూ
తములయందు నుండుట వల్లనున్ను యాథార్థ్యమును
గుర్తెఱిగిన యోగీశ్వరులచేత వాసుదేవుడని తెలుసు కొన
దగినవాడను.

మఱియు విష్ణుపురాణము౧ అంశము౨ అధ్యాయములో;

శ్లో॥ సర్వత్రాసౌ సమస్తంచ వసత్యత్రేతి వైయతః। తతస్సవాసు దేవేతి విద్వద్భిః పరిపఠ్యతే॥ అనియున్నది.

ఇతడు సమస్తమునందుండుట వలననున్ను, సమస్తము ఇతని యందుండుట వలన నున్ను, వాసుదేవుడని విద్వాంసుల చేత చెప్పబడుచున్నాడు, అనిభావము.

పైశ్లోకమునకు ముందున్న శ్లోకములు.

౧, పరః పరాణాం పరమః పరమాత్మాత్మ సంస్థితః। రూపవర్ణాదినిర్దేశ విశేషేణచ వర్జితః॥

౨, అపక్షయ వినాశాభ్యాం పరిణామర్ధి జన్మభిః। వర్జిత శ్శక్యతే వక్తుంయస్సదా స్తీతి కేవలమ్॥

అనగా నుత్కృష్టుల కంటె నుత్కృష్టుడు, నిస్సమాభ్యధికుడు జీవాత్మలకు ఆత్మస్వరూపుడు, తనయందే తానుండువాడు. అనగా దనకు నితరము లాధారములు గావనుట. రూపాదులు శుక్లవర్ణాది విశేషములు లేనందున వాట్లవలన నిర్దేశింప దగనివాడు॥ ౧ ॥

కృశించుటయు, నశించుటయు, పరిణామము. అనగా తనపరమాత్మస్వరూపము వెడల్పుగ పొడవుగ నగుటయు, వృద్ధిబొందుటయు, పుట్టుటయు, నివి లేనివాడై, యెల్లప్పుడున్నాడని ముఖ్యముగా జెప్పుటకు శక్యుడెవడో వాడు వాసుదేవుడు, ౨, అనిభావము.

ఇట్లు చెప్పబడియుండుట వలన త్రికాలాబాధ్యుడు, అనగా నెల్లపుడు, సత్యముగా నుండు వాడని, యేర్పడుటచేత వాసుదేవ యనునామముతో గూడ సత్యము అను పదమును జేర్చి "వాసుదేవస్సత్యం"

అని పెద్దలచేత నుచ్చరింప బడుచున్నది. ఇదిశబ్దప్రమాణము.

ఇక ననుభవప్రమాణమును వ్రాయుచున్నాను. ఎట్లన—

సమస్త ప్రపంచమును బయలునందు నిరాధారముగా నిలిచి యుండుట, ప్రత్యక్షసిద్ధము, అయితే, ప్రతివస్తువునకు ఆధారములేనిది యుండజాలదు, భూమి బయలులో ఆత్మప్రదక్షిణము నిత్యముచేయు చుండుటయు, చంద్రసూర్యాది నక్షత్రములు బయలులో నుండి తమ తమ గతులు దప్పక సంచరించుచు నుండుటయు, జూచుచున్నాము గదా?

ఇట్టి పదార్థముల కాధార మెవడు. మఱియు గీతలలో॥ "సూత్రేమణిగణాఇవ" అని యుండునట్లు సమస్తమునకు చైతన్యము లులోపల నున్నవి. ఆచైతన్యములకు నదృష్టాధీనముగా సుఖదుఃఖాదుల ననుభవింప జేయుటకై, తదనుగుణమయినప్రేరణచేయుటకును, తత్తజ్జీవ కర్మములు సాక్షిగానెఱింగి, తదనుగుణ ఫలములనిచ్చుటకును సర్వజీవాంతర్యామిగా నుండవలయును.

ఇందు వలన సర్వమునకు లోపల వెలుపల నుండుటవలన పైన శాస్త్రములలో జెప్పబడిన "వాసుదేవః" అనునామముసార్థకమైనది.

కాబట్టి యిది యసదర్థవాదము కాదు, దేవుని పరిపూర్ణతను సర్వశక్తిత్వమును స్థాపించుచున్నయది.

మఱియు ననిత్యమైనట్టియు, రూప నామాత్మకమైనట్టియు, నీ ప్రపంచము నెల్లప్పుడును సృజించుచు పాలించుచు నుండుటకు సర్వశక్తులు గల వాసుదేవు డెల్లప్పుడు నుండకతీఱదు కాబట్టి సత్యశబ్దమును జేపర్చవలయును.

దీనివలన "వాసుదేవస్సత్యం" అని పెద్దలుచ్చరించుచున్నారు.

ఇట్లు సర్వవ్యాపకుడే కారణమని నిర్ణయింపబడు నీవాసుదేవ నామము గల దేవుడు; అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ, అను నాలుగు వ్యూహములలో గడపటి వ్యూహమనియు, ఈయనకు రూపము, లోకము, గృహము, భార్యయు, మొదలగు నవి కలవని యు, ఆగమపురాణాదులలో జెప్పుట; మందబుద్ధుల కుపాసనార్థ ముగ గల్పించి చెప్పబడినవి. ఇందుకు నుపనిషత్తులో "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అనియున్నది. ఇంతయే గాని, రూపము, నివసించుటకై లోకము, గృహము, భార్యయు మొదలగునవి లేవు. అట్లున్న యెడల, పరిచ్ఛిన్నతయు, వషాతపాసహిష్ణుతయు, వ్యవాయక్రీడాద్యాసక్తియుగలవాడుగా నేర్పడును.

పరిచ్ఛిన్నుడుగానుంటే ఆయనశక్తులు పరిచ్ఛిన్నములు గావల సివచ్చును, మఱియు ఆనంద స్వరూపునికి వషాతపాదులవలన దుః ఖంబులును అవాప్తసమస్తకాముడు నిత్యతృప్తుడు నగు వానికి భా ర్యాది విషయాసక్తియును గలుగునా? అట్లు కలిగితే మఱికొంత శక్తి గలిగిన మనవంటి వాడే యగును. ఇందువల్లనే యేమో అద్వైతులు రూపములు గల శివనారాయణాదులను చిదాభాసులని చెప్పుచున్నా రు. గావునరూపాదుల నంగీకరింప గూడదు.

ఇందుకు కొందఱు వైష్ణవులు దివ్యాత్మ స్వరూపమనియు, ది వ్యమంగళ విగ్రహస్వరూప మనియు, నీరెండు ఆయనకే గలవనియుం జెప్పుచున్నారు. అప్పటికి "యద్దృశ్యంతన్నశ్యం" అను ననుభవమున్ను

బట్టి భగవంతుడు స్వేచ్ఛతోధరించిన దైనను పరిదృశ్యమాన మయిన యీరూపము నశ్వరమేగదా? యని యడిగితే, ఆరూపాదులు మన శువలె మత్య్య వచ్చినవి గావు. అట్లువచ్చియుంటె నశించిపోను.

అట్టివి గావు, వ్యూహాది రూపాదులు నిత్యేచ్ఛా సిద్ధము లని చెప్పచున్నారు. ఈమాట పిల్లవాడు, పిచ్చివాడు, కూడ చెప్పడు. జె ప్పడు. ఎందు వలన నంటే, నిత్యేచ్ఛాసిద్ధమనునది యర్థములేనిమా ట. ఎట్లన, నిత్యమయితే ఇచ్ఛాసిద్ధ మెట్లగును. ఇచ్ఛాసిద్ధమనునప్పటి కి, పూర్వము లేక యిచ్ఛచేత నీవలదేవుడు రూపాదులను ధరించిన ట్లుండవలెను. లేక, యీరూపాదులు నిత్యములయితే యిచ్ఛాసిద్ధము లనుట కర్థమేమి. అప్పటికి నిత్యము లనియే చెప్పవచ్చును. నిత్యేచ్ఛా సిద్ధము లనుటకు నిచ్ఛ,పూర్వము కలిగి యీవల రూపము ధరించితే అట్లుచెప్పవచ్చును గాని,నిత్యమయితే యట్లుచెప్ప గూడదు.ఏలనంటే, "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" అని చెప్పబడియున్నదెగాని అట్టి బ్రహ్మ ము నిత్యేచ్ఛాసిద్ధమని జెప్పుటనైన నున్నదా?

పూర్వము చక్కగా నాలోచింపక వ్రాసిన గ్రంథములలో నుండు మతపిచ్చులను బట్టి యోచింపక వ్యాఖ్యానంబున జెప్పుమాట యని బుద్ధిమంతులూహింతురు.

గావున వాసుదేవునికి రూపవర్ణాదులు లేక యస్తిత్వము చే తనే సర్వశక్తులు గలవాడని యెగువ శాస్త్రముచేతను, యుక్తు లచేతను. వ్రాయబడినది. సరియని బుద్ధిమంతులయినవార లంగీకరిం తురు.

బ్రహ్మము నొక మహారాజదృష్టాంతముగ, రూపవర్ణ లోక గృహ భార్యాయుధ పోషణాదాదులుగలవానిగా జెప్పుటగాని యే గుణము లేని యొక శుద్ధశూన్యప్రాయ మని, చెప్పుటగాని, మఱపి చ్చులచేత గలుగ జేసికొన్న విరోధములను బట్టి వ్రాసిన శాస్త్ర భాగముల నమ్మి చెప్పెడు మాటలుగాను, పాండిత్య దుర్వాదములు గాను, నున్నవి. ఇట్లుండగా అర్థక్రియా కారియగు జగత్తు మిథ్య యనియు, నీజగత్తుకు నేమియు లేనిదిగ నిర్గుణమై యొక శూన్య ప్రాయమయిన బ్రహ్మము కారణ మనియు, వారు నోట జెప్పుటకు నెట్లు సాహసించిరో నాకు గోచరింపలేదు. అట్టి వారికి సర్వశక్తి గలదేవు డెట్టి శిక్షను చేయునో యది యూహకు రాలేదు.

అయితే యిట్లునాకు నూహకు వచ్చుచున్నది, ఎట్లనగా : పాద్మోత్తర పురాణము నందు శివుడు పార్వతికి తామస శాస్త్రము లను జెప్పుచోట॥ "శ్లో॥ మాయా వాద మసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధముచ్యతే । మయైవ కథ్యతే దేవి కలౌ బ్రాహ్మణ రూపిణా ॥ వేదార్థవన్మహా శాస్త్రం మిథ్యావాద మవైదికం । మయైవవక్ష్య తే దేవి జగతాంనాశ కారణాత్॥" అనిచెప్పబడియున్నది.

మఱియు గీతలలో "శ్లో॥అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీ శ్వరం॥" అనియు "ఈశ్వరోహమహంభోగీ" యనియు ఆసురీ సం పదగలవారు చెప్పుచున్నారని చెప్పబడి యుండుట వలన నిట్టి మత ములు ఆసురీ సంపదగలవారలంగీకరింప వలయునేగాని, బుద్ధిమంతు లయిన తత్త్వవేత్తలకు నంగీకార్యములు గావు.

మరియు విష్ణుపురాణములో- ౬ అంశము- ౫ అధ్యాయములో-

౫౯ నిరస్తాతిశయాహ్లాద సుఖభావైక లక్షణా। భేషజంభగవత్ప్రా
ప్తిరేకాంతాత్యంతికీమతా॥ అనగా నిరతిశయపరమానంద స్వరూ
పంబును- దుఃఖసంబంధములేనిదియు- నాశరహితంబునగుభగవత్ప్రా
ప్తి-బంధదుఃఖమునుబోగొట్టునట్టియౌషధము.

౬౦ తస్మాత్తత్ప్రాప్తయేయత్నఃకర్తవ్యఃపండితైర్నరైః। తత్ప్రా
ప్తిహేతుర్జ్ఞానంచకర్మచోక్తమ్మహామునే॥

అనగా కావున పండితులగువారలు భగవత్ప్రాప్తింబొందుటకు
ప్రయత్నముచేయవలెను. ఆభగవత్ప్రాప్తిసిద్ధించుటకు-జ్ఞానము
నుకర్మమును కారణములు.

౬౧ ఆగమోత్థంవివేకాచ్చ ద్విధాజ్ఞానంతదుచ్యతే। శబ్ద బ్రహ్మాగమ
మయంపరంబ్రహ్మవివేకజమ్॥

అనగాఅందు- జ్ఞానముఆగమజన్యమనియు వివేకజన్యమనియు రెం
డువిధములు-అందుఆగమజన్యజ్ఞానము- శబ్దబ్రహ్మమనియు-వివేకజ
న్యజ్ఞానముపరబ్రహ్మమనియు చెప్పబడియున్నది.

౬౨ అంధంతమఇవాజ్ఞానం దీపవచ్చేంద్రియోద్భవమ్। యథాసూర్య
స్తథాజ్ఞానంయద్విప్రషేవివేకజమ్॥

అనగా- అజ్ఞానముపెనుజీకటివంటిది- దానికి ఆగమజన్యజ్ఞానము
దీపమువలెనుండును- వివేకజన్యజ్ఞానము- సూర్యునివలెనుండును.

౬౩ మనురప్యాహవేదార్థం స్మృత్వాయన్మునిసత్తమ। తదేతచ్ఛ్రూ
యతామత్రసబంధే గదతోమమ॥

అనగా ఈవిషయమునందుమనువుచెప్పిన వేదార్థమునుగూడ చె
ప్పెదవినుము.

౬౪ ద్వేబ్రహ్మణీవేదితవ్యే శబ్దబ్రహ్మపరంచయత్ । శబ్దబ్రహ్మణినిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి॥

అనగా శబ్దబ్రహ్మమనియు పరబ్రహ్మమనియుబ్రహ్మము రెండువిధములు- శబ్దబ్రహ్మముపరబ్రహ్మము నీరెండును దెలియదగినవి. ఐతే శబ్దబ్రహ్మమును దెలుసకొన్న పిదప- పరబ్రహ్మమును పొందుచున్నాడు.

౬౫ ద్వేచవిద్యే వేదితవ్యే ఇతిచాథర్వణీశ్రుతిః । పరయాత్వక్షరప్రాప్తిఃఋగ్వేదాదిమయాఽపరా॥

అనగా విద్యలు రెండువిధములని అథర్వణశ్రుతి చెప్పుచున్నది అందుపరవిద్యచే పరబ్రహ్మప్రాప్తికలుగును- రెండవది ఋగ్వేదాదిరూపము

౬౬ యత్తదవ్యక్తమజరమచింత్యమజమవ్యయమ్ । అనిర్దేశ్యమరూపంచపాణిపాదాద్యసంయుతమ్॥

౬౭ విభుసర్వగతం నిత్యం భూతయోనిరకారణమ్। వ్యాప్యవ్యాప్తం యతస్సర్వం యద్వైపశ్యంతిసూరయః॥

౬౮ తద్బ్రహ్మతత్పరంధామ తద్ధ్యేయం మోక్షకాంక్షిభిః । శ్రుతివాక్యోదితంసూక్ష్మం తద్విష్ణోఃపరమంపదమ్॥

అనగా- ఏదిజరాదులులేనిదియు అచింత్యమైనదియు జన్మనాశంబులులేనిదియు పాణిపాదాదియుక్తరూపములేనిదియు. సర్వనియామకంబును అన్నిటను వ్యాపించియుండునదియు నిత్యమైనదియు. సమస్తభూతంబులకు గారణంబైనదియు, దనకు గారణములేనిదియు మరియేపదార్థముచేతను వ్యాపింపబడనిదియై యుండునో- దేనివలన జగత్తంతయు బుట్టెనో దేన్ని పండితులగువారలు ధ్యానింతురో - అది పరబ్రహ్మము- అదియే పరమస్థానము- దానినే మోక్షముగోరువారు ధ్యానింపవలయును అదియే వేదవాక్యములచే జెప్పబడినదియు- సూ

క్ష్మమైనదియు అజిమే సర్వవ్యాపకమైన పరబ్రహ్మము యొక్క స్వరూపము.

ఏ దేవభగవద్వాచ్యం స్వరూపం పరమాత్మనః - వాచకో భగవచ్ఛబ్ద స్తస్యాద్యస్యాక్షయాత్మనః॥

అనగా అట్టి పరమాత్మస్వరూపమే భగవచ్ఛబ్దవాచ్యము పురాణ పురుషుండును - నాశరహితుండునగు పరమాత్మునే భగవచ్ఛబ్దము చెప్పుచున్నది.

౭౦ ఏవంనిగదితార్థస్య తత్త్వంసత్యస్యతత్త్వతః । జ్ఞాయతే యేన తత్ జ్ఞానం పరమన్యత్త్రయీమయమ్॥

అనగా ఇట్లు పైచెప్పిన పరబ్రహ్మతత్త్వము దేనిచే దెలియబడుచున్నదో - అదిపరజ్ఞానము ఇతరమైనది ఆగమజన్యము.

౭౧ అశబ్దగోచరస్యాపి తస్యవై బ్రహ్మణోద్విజ । పూజాయాం భగవచ్ఛబ్దః క్రియతే హ్యుపచారతః॥

అనగా ఆపరబ్రహ్మము - శబ్దగోచరము కానిదైనను ఉపచారముగా పూజయందు పైచెప్పబోవు గుణములచేత భగవచ్ఛబ్దము వ్యవహరింపబడుచున్నది.

౭౨ శుద్ధేమహావిభూత్యాఖ్యే పరేబ్రహ్మణివర్తతే । మైత్రేయభగవచ్ఛబ్ద స్సర్వకారణ కారణే॥

అనగా - కావున శుద్ధమును మహావిభూతిగలదియును - సర్వకారణ కారణమునునగు పరబ్రహ్మమునందు వర్తించుచున్నది.

౭౩ సంభర్తేతి తథా భర్తా భకారోర్థో ద్వయాత్మకః । నేతా గమయితా స్రష్టా గకారార్థస్తథా మునే॥

అనగా - పోషించువాడు అనియు - నిత్యాధార రూపుడనియు - ఇవిభగవచ్ఛబ్దమునందుండు భకారమునకు అర్థములు - జగత్తును సం

రక్షించువాడు తనయందుపసంహరించు కొనువాడు- సృజించు వాడనియు- ఇవిగకారమునకర్థములు.

౭౪ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్యయశసశ్శ్రియః। జ్ఞానవైరాగ్యయో శ్చైవషణ్ణాంభగ ఇతీరణా॥

అనగా- నిరతిశయములైన ఐశ్వర్యము- వీర్యము- కీర్తియు- సంపదయు- జ్ఞానము వైరాగ్యము- ఈ ఆరును- భ-గ- అను రెండక్షరములుగలసిన భగయనుదానికి అర్థము.

౭౫ వసంతి తత్రభూతాని భూతాత్మన్యఖిలాత్మని। సచభూతేష్వశేషేషు వకారార్థస్తతోవ్యయః॥

అనగా- భూతమయప్రపంచ శరీరుండును - సమస్తమునకాత్మ స్వరూపుడునగు - నతనియందుభూతములువసించుచున్నవి- అతండును సర్వభూతములయందు వసించుచున్నాడు- అనిఇదివకారమునకర్థము.

౭౬ ఏవమేష మహాశబ్దో మైత్రేయభగవానితి। పరమబ్రహ్మభూతస్యవాసుదేవస్య నాన్యగః॥

అనగా- (భగవాన్) అనునీమహాశబ్దము ఇట్టిఅర్థముగలది- ఇది పరబ్రహ్మమైన వాసుదేవునియందుదప్ప మఱియెచ్చటను వర్తింపదు.

౭౭ తత్రపూజ్య పదార్థోక్త పరిభాషా సమన్వితః। శబ్దోయంనోపచారేణ చాన్యత్రహ్యుపచారతః॥

అనగా- నిఘంటువునందు చెప్పబడినట్లు పూజ్యార్థవాచకమైన ఈభగవచ్ఛబ్దము వాసుదేవునియందు ఔపచారికముగాదు - ఇత

రత్రయౌపచారికము- ఎట్లనగా.

౭౮ ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామా గతింగతిమ్ । వేత్తివిద్యామవిద్యాంచసవాచ్యో భగవానితి॥

అనగా- ఎవడుజగదుత్పత్తినిజగత్ప్రళయంబును - భూతముల యొక్క-గతాగతంబులను విద్యను అవిద్యనుయెరుంగునో అతడు- భగవంతుడని యుపచారముగాచెప్పదగినవాడు ఇదిఔపచారికముగా నితరులయందు బ్రయోగించవచ్చును.

౭౯ జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజాంస్యశేషతః । భగవచ్ఛబ్దవాచ్యానివినాహేయైర్గుణాదిభిః॥

అనగా- ప్రకృతిగుణములుకాని- జ్ఞానము-శక్తి-బలము- ఐశ్వర్యము- వీర్యము- తేజస్సు ఇవిమొదలుగాగల సమస్త సద్గుణంబులు భగవచ్ఛబ్ద వాచ్యములు.

౮౦ సర్వాణి తత్రభూతాని వసంతి పరమాత్మని । భూతేషుచస సర్వాత్మావాసుదేవ స్తతస్మృతః॥

అనగా- ఆపరమాత్మయందు- సమస్తభూతములు వసించుచున్నవి- భూతములయందు సర్వాత్ముండగు నాతండును వసించు చున్నాఁడు-కావునయితడువాసుదేవుడని చెప్పబడుచున్నాడు అనియున్నది.

కావునసర్వశక్తులుగల వాసుదేవుడే సర్వమునకుకారణమనియెంచి యనన్యగతికదృఢభక్తితో దన్నుస్మరించువారిని - తనమాయామోహము నుండి తొలగించి సర్వవిధములరక్షించుచున్నాడు- ఇందుకుశ్రీభాగవత

ము ౩ స్కంధము ౭ అధ్యాయములో-౧౪॥శ్లో॥సవై నివృత్తిధర్మేణవా-
సుదేవానుకంపయా। భగవద్భక్తియోగేనతిరోధత్తేశనైరిహ॥అనియు
న్నదిగాన- సర్వమునకు వాసుదేవుడే గతి-

## (*) నిర్గుణవాద నిరాకరణము. (*)

అను గ్రంథము.

సంపూర్ణము.